మించకుండాను ఋణాలు ఇవ్వబడతాయి. రెండు దఫాలలో ఋణం మొత్తం చెల్లింపు చేయబడుతుంది. పని మొదలు పెట్టినపుడు ఋణంలో కొంతభాగం ఇవ్వబడుతుంది. పని చాలవరకు కొనసాగి, సకాలంలో పని ముగుస్తుందని అధికార్ల అభిప్రాయ పడినపుడు మిగతా ఋణం చెల్లించబడుతుంది. తెలంగాణా ప్రాంతంలో 214 క్రొత్తబావుల త్రివ్వకానికి, 142 పాతబావుల మరమ్మత్తుకు గాను ఋణాలు మంజూరు చేయటంకోసం 1959-60 ప్రణాళికలో రు. 6.42 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.31 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఈ మొత్తంతో 9 క్రొత్తబావులు త్రవ్వబడతాయి. 10 పాతబావులకు మరమ్మత్తు చేయబడుతుంది.

## బోరింగు నూతులు

ఈ పథకం క్రింద నూతులలో బోరింగు వేయడానికి అవసరమయ్యే యంత్ర పరికరాలను కొనటానికి, ప్రస్తుతమున్న బావుల నీటిసరఫరాను అధికం చేయుటకుగాను వాటికి బోరింగు వేసే నిమిత్తం సిబ్బందిని నియమించడానికి ప్రతిపాదింపబడింది. 136 బావులలో బోరింగువేసే నిమిత్తం 1959-60 లో రు. 0.19 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.03లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది. ఈ మొత్తంతో ఈ జిల్లాలోని 24 బావులలో బోరింగువేయ బడుతుంది.

## క్రొత్తబావుల సబ్సిడీ పథకం

తెలంగాణా ప్రాంతంలో రైతులు బావులు త్రవ్వకొనేటందుకుగాను ప్రతి బావికి రు. 750/- ల చొప్పున సబ్సిడీ ఇచ్చేనిమిత్తం 1959-60 ప్రణాళికలో రు. 9,375 లక్షల మొత్తం కేటాయించ బడింది. యీ సంవత్సరంలో 1,250 బావులు త్రవ్వబడుతాయని ఆశించ బడింది. పై మొత్తంలో రు. 1.6875 లక్షల మొత్తం ఈ జిల్లాలో 225 క్రొత్తబావుల త్రవ్వకం నిమిత్తం కేటాయించ బడింది.

## చిన్నతరహా నీటిపారుదల పనుల అభివృద్ధి పథకం

చిన్న తరహా నీటిపారుదల వనరులను పునరుద్ధరించి, అభివృద్ధిపరచటం కోసం ఈ జిల్లాకు రు. 0.60 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ జిల్లాలో

గండ్లుపడి, వాడకంలో లేనటువంటి చెరువులు, ముఖ్యముగా ప్రభుత్వమువారిచే స్వాధీనం చేసికోబడిన ఎస్టేట్లలోనివి, పునరుద్ధరింపబడి అభివృద్ధి చేయబడతాయి.

---

# పశుగణాభివృద్ధి

## పశువైద్యశాఖ ప్రధాన కార్యాలయానికి, జిల్లా కార్యాలయాలలోను అదనపు సిబ్బంది నియామకం

పశువైద్యశాఖ కార్యక్రమాలు రోజురోజుకు పెరుగుతున్నాయి. ఎక్కువయిపోతున్న పనిని నిర్వహించేటందుకు వీలుగా 1957–58 లో అదనపు సిబ్బంది నియమించబడింది. యీ సంవత్సరంలో ఈ సిబ్బంది కొనసాగించబడుతుంది. ఇంతేకాక ప్రభుత్వ పశుక్షేత్రాలలోను, ప్రధాన కార్యాలయంలోను, జిల్లా కార్యాలయాలలోను ఇంకా కొంత అదనపు సిబ్బంది నియమించబడుతుంది. ఇందుకు గాను ఈ జిల్లాకు 1959-60 సంవత్సరానికి రు. 0.09 లక్ష మొత్తం కేటాయించబడింది.

## స్టేషనరీ పశువైద్య శాలల స్థాపన

జబ్బుతో బాధ పడుతున్న పశువులకు వైద్య సహాయం అందుబాటులో ఉంచడానికి, వాటికి క్రమ పద్ధతిలో చికిత్స చేయడానికి గాను ఈ పథకం క్రింద తెలంగాణ ప్రాంతంలోని ముఖ్యమయిన తాలుకా కేంద్రాలలో స్టేషనరీ పశు వైద్య శాలలను ఏర్పాటు చేసేటందుకు ప్రతిపాదింప బడింది. పశువైద్య సౌకర్యాలు అవసరమయి ఉండి, ప్రజలు లేక స్థానిక పంచాయతీల నుండి విరాళాలు లభించే స్థలాలలో ఈ వైద్యశాలలు ఏర్పాటు చేయబడతాయి. ప్రతి వైద్య శాల కూడ ఒక వెటరినరీ అసిస్టెంటు సర్జను అధ్వర్యంలో పని చేస్తుంది. 1959-60 లో తెలంగాణా ప్రాంతంలో ఇదివరకే ఏర్పాటు చేయబడిన పశువైద్యశాలలను కొనసాగించడమే.కాక మరో నాలుగు వైద్యశాలలు ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు గాను రు. 0.93 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.138 లక్ష మొత్తం ఈ జిల్లాలో మూడు వైద్యశాలలను కొనసాగించటానికిగాను ప్రత్యేకించబడింది.

## చిన్న తరహా పశువైద్యశాలలు

అంటువ్యాధులు వ్యాపించకుండా నిరోధించడానికి, జబ్బుపడిన పశువులకు వైద్యసహాయం అందజేయడానికిగాను తెలంగాణా ప్రాంతంలో 1959–60 లో 10 చిన్నతరహా పశువైద్యశాలలను ఏర్పాటు చేసేటందుకు, ఇదివరకే ఏర్పాటు చేయబడిన పశువైద్యశాలలను కొనసాగించటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు గాను రూ. 1.78 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ. 0.18 లక్ష మొత్తంతో ఈ జిల్లాలో 3 చిన్న తరహా పశువైద్యశాలలను కొనసాగించే టందుకు ప్రతిపాదింప బడింది.

## జిల్లా పశువైద్య శాఖాధికారులకు జీపుల సరఫరా

జిల్లా పశువైద్యశాఖాధికార్లు తమక్రింద పనిచేసే ఉద్యోగులపనిని తనిఖీ చేసి, వారిని అప్రమత్తతతో ఉంచేటందుకుగాను విస్తృతంగా పర్యటనలు జరప టకు, తరుచుగాను, ఆకస్మికంగాను ఉద్యోగులపనిని తనఖీచేయుటకు వీలుకల్పించే నిమిత్తం వీరికి యిదివరకే సరఫరా చేయబడిన జీపులను 1959–60 లో రూ. 0.45 లక్ష వ్యయంతో నిర్వహించుటకు ప్రతిపాదింప బడింది. ఇందులో రూ. 0.0562 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## స్టాక్ మెన్‌లకు శిక్షణ

పశువైద్య శాస్త్రం, పశుగణాభివృద్ధి విషయాలలో ప్రాథమిక విజ్ఞానాన్ని గురించి అభ్యర్థులకు ఈ పథకం క్రింద ఆరు నెలలపాటు శిక్షణ ఇవ్వబడుతుంది. ఇందుమూలంగా వారు అంటువ్యాధులు ప్రబలకుండా నిరోధక చర్యలు తీసికోవడా నికి, పశుగణాభివృద్ధి పథకాలకు సంబంధించి ప్రాథమికమైన పనులను నిర్వ హించడానికి వీలుచేకూరుతుంది. శిక్షణ పూర్తిఅయిన తరువాత ఈ అభ్యర్థులు కాంపౌండర్లుగా నియమించ బడతారు. నారాయణగూడాలోని పశువైద్యశాలలో 170 మంది విద్యార్థులు శిక్షణ నిమిత్తం 1957–59 లలో చేర్చుకోబడినారు. తెలం గాణాలో మరో 260 మంది అభ్యర్థులకు స్టాక్ మెన్‌లుగా శిక్షణ ఇవ్వడానికి ప్రతి పాదింప బడింది. ఇందుకుగాను 1958–60 ప్రణాళికలో రు. 0.38 లక్ష మొత్తం

కేటాయించ బడింది. ఇందులో రు. 0.08 లక్ష మొత్తం 50 మంది అభ్యర్థుల శిక్షణకుగాను ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## కోళ్ళ పెంపక విస్తర్ణ కేంద్రాలు

క్రొత్తగా రెండు కోళ్ళ పెంపక విస్తరణ కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకుముందే ప్రారంభించబడిన నాలుగు కోళ్ళ పెంపక విస్తరణ కేంద్రాలను కొనసాగించటానికి గాను 1959–60 ప్రణాళికలో రు. 1.28 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.05 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది. ఈ మొత్తంతో ఈజిల్లాలో ఇదివరకే స్థాపించబడిన కేంద్రం కొనసాగించబడుతుంది.

## కీలక గ్రామపథకం

తెలంగాణా ప్రాంతంలో ఇంతకుముందు ఏర్పాటుచేయబడిన 5 కీలక గ్రామ కేంద్రాలను కొనసాగించటానికి, క్రొత్తగా మరోరెండు కేంద్రాలను ఏర్పాటు చేయటానికిగాను 1959–60 ప్రణాళికలో రూ. 3.65 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రూ. 0·366 లక్ష మొత్తం ఈ జిల్లాలోని ఒక కీలక గ్రామ కేంద్రం కొనసాగింపు నిమిత్తం ప్రత్యేకించ బడింది.

## గోశాలల అభివృద్ధి పథకం

ఈ జిల్లాలోని ఒక గోశాలకు ఆర్థిక సహాయం (గ్రాంటు–ఇన్–ఎయిడ్) నిమిత్తం 1959–60 ప్రణాళికలో రు. 0.135 లక్ష మొత్తం కేటాయించ బడుతుంది.

## గొఱ్ఱెలు, ఉన్ని అభివృద్ధి కేంద్రాలు

గొఱ్ఱెల పెంపకానికి సంబంధించిన ఆధునిక పద్ధతులను ప్రదర్శన పూర్వకంగా వివరించటంకోసం యీ జిల్లాలో 4 గొఱ్ఱెలు, ఉన్ని అభివృద్ధి కేంద్రాలు

ఏర్పాటు చేయబడినాయి. ఈ కేంద్రాల కొనసాగింపుకోసం 1959_60 ప్రణాళిక లో రు. 0.21 లక్ష కేటాయించబడింది.

## జిల్లా, రాజ్య పశుప్రదర్శనలు

1959-60లో ఒక జిల్లాపశుప్రదర్శనం యీజిల్లాలో ఏర్పాటుచేయబడుతుంది ఇందుకుగాను ప్రణాళికలో రూ. 0.01 లక్ష కేటాయించ బడింది.

## రిండరు పెస్టు వ్యాధి నిర్మూలన పథకం

ఈ జిల్లాలో రిండరు పెస్టువ్యాధి నిర్మూలన ఉద్యమంకోసం రు. 0.944 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ఆబోతుల పంపకం

ఈ పథకం క్రింద, 1959_60 లో రూ. 0.06 లక్ష అంచనా వ్యయంతో ఈ జిల్లాలో మాల్వి, ఒంగోలు లేక ముర్రా రకానికి చెందిన 6 ఆబోతులను పంచ డానికి ప్రతిపాదింప బడింది.

## పశుప్రథమ చికిత్సా కేంద్రాల ఏర్పాటు

పశువైద్యశాస్త్రంలో పట్ట భద్రులయిన వారి కొరత చాల ఎక్కువగా ఉన్నందువల్ల పశువైద్యశాలలుగాని, చిన్నతరహా పశువైద్యాలయాలుగాని ఏర్పాటు చేయటానికి వీలుపడడంలేదు. 1959_60 లో తెలంగాణా ప్రాంతంలో కనీసం 7 పశు ప్రథమ చికిత్సా కేంద్రాలను రు. 0.13 లక్ష వ్యయంతో ఏర్పాటు చేయ టానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 0.0183 లక్ష యీ జిల్లాలో ఒక ప్రథమ చికిత్సా కేంద్రాన్ని ఏర్పాటు చేయుటకుగాను ప్రత్యేకించబడింది. ఒక వెటిరినరి కాంపౌండరు ఒక అటెండెంటు సహాయంతో పశు ప్రథమ చికిత్సా కేంద్రాన్ని నిర్వహిస్తాడు. ఆ ప్రాంతపు చిన్న చిన్న కేసులన్నీ వాళ్ళే చూస్తారు. ప్రథమ చికిత్సా కేంద్రాన్ని నెలకొల్పేటందుకయ్యే ఖర్చులో సగ భాగం విరాళాల రూపంలో లభించే స్థలాలలోనే యీ కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి.

# పాడి పరిశ్రమ, పాలసరఫరా

## కరీంనగరులోని పాడి పరిశ్రమ, పశుపోషక క్షేత్రం పునర్వ్యవస్థీకరణ

క్రమ పద్ధతిలో పశువులను పెంచటం ద్వారాను, వాటిని మంచి పరిస్థితులలో నిర్వహించటం ద్వారాను తెలంగాణాలో ప్రఖ్యాతిగాంచిన మాల్వీ తెగ పశువులను అభివృద్ధిచేసే ఉద్దేశంతో కరీంనగరులో ప్రభుత్వ పశుపోషక, పాడిపరిశ్రమ క్షేత్రం స్థాపించబడింది. ఈ క్షేత్రంలో పశువులకు ఆవాసం కల్పించేటందుకు సరియైన సౌకర్యాలు లేనందువల్ల యీ క్షేత్రంలో పశువులకుగాను పాకలను నిర్మించటానికి ప్రతిపాదించబడింది. ఇంతేకాక కార్యాలయ భవనము, సూపరింటెండెంటుకు వసతిగృహము నిర్మించటానికి కూడ ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.59 లక్ష మొత్తం కేటాయించబడింది.

# అడవులు

## ప్రాంతీయ డివిజన్ల ఏర్పాటు, అదనపు సిబ్బంది నియామకం

భూసార రక్షణ కార్యక్రమాన్ని, భూమికోరివేతను అరికట్టే పనులను, అడవులను పెంచే కార్యక్రమాన్ని, అడవులలో మొక్కలను నాటే కార్యక్రమాన్ని స్వాధీనంచేసుకోబడిన పూర్వపు ఎస్టేటు అడవులకు సంబంధించి సరిహద్దులను ఏర్పరచే పనిని నిర్వహించుటకు గాను 1956-57 లో నియమించబడిన సిబ్బందిని కొనసాగించే నిమిత్తం రూ. 0.032 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## కలప అడవులలో కృత్రిమ పద్ధతిమీద చెట్లపెంపకం

ముందుముందు అవసరం అయ్యే కలప అవసరాలను ఆదుకొనేటందుకై ఖమ్మం, వరంగల్లు, ఆదిలాబాదు, కరీంనగరు జిల్లాలలో కలపనిచ్చే చెట్లరకాలను పెంచేటందుకుగాను పునరుద్ధరణ క్షేత్రాలను ఏర్పాటుచేయటానికి యీ పథకం

క్రింద ఉద్దేశించబడింది. పాత క్షేత్రాలను నిర్వహించటమేగాక క్రొత్తగా 70 ఎకరాల ప్రదేశంలో పునరుద్ధరణ క్షేత్రాలను ఏర్పాటుచేయటానికై 1959–60 ప్రణాళికలో యీ జిల్లాకు రు. 0.03 లక్ష కేటాయించ బడింది.

## అడవుల అభివృద్ధికి "నర్సరీలు"

రెండవ ప్రణాళిక క్రింద అడవులను పెంచటానికి, పునరుద్ధరించటానికి నిర్ణయించబడిన ప్రాంతాలకు కావలసిన మొక్కల అవసరాన్ని తీర్చటానికై, తెలంగాణా ప్రాంతంలోని వివిధ కేంద్రాలలో "నర్సరీ యూనిట్లు" ఏర్పాటు చేయబడుతున్నాయి. 1959–60 లో యీజిల్లాలో ఒక నర్సరీ యూనిట్టు ఏర్పాటు చేయుటకుగాను రు. 0.04 లక్ష మొత్తం కేటాయించబడింది.

## రోడ్ల నిర్మాణం

ప్రభుత్వానికి ఆదాయం సమకూర్చే ఖరీదైన కలపను వినియోగంలోకి తేవటానికై యీ పథకంక్రింద రెండవ ప్రణాళికా కాలంలో అడవుల్లో రోడ్లను నిర్మించటానికి ప్రతిపాదింప బడింది. ఈ జిల్లాలో నాలుగుమైళ్ళ రోడ్లను నిర్మించటానికిగాను ఈ సంవత్సరానికి రు. 0.20 లక్ష కేటాయించబడింది.

# భూసార రక్షణ

## కాంటూరు బండింగు (సొలోపు గట్లుపోయడం.)

తెలంగాణా ప్రాంతంలో భూములు మిట్టపల్లాలతో కూడుకొని ఉండటం చేత భూసార రక్షణ అనేది చాలా తాలూకాలలో సమస్యగా పరిణమించింది భూసార క్షీణతను అరికట్టడానికి తద్వారా పంట దిగుబడిని పెంచడానికి భూమిలో తేమను కాపాడటానికిగాను సొలోపు గట్లుపోయడం, చదును చేయడం, సొలోపుల వెంబడి దున్నడం, గట్లపై పైర్లు నాటడంవంటి భూసార రక్షణ చర్యలు తీసికోబడుతున్నాయి. మధ్య రకం, తేలిక రకం భూముల్లో, అందులోను ముఖ్యంగా ఎర్ర ఇసుక భూములలో, గట్లుపోసే కార్యక్రమం అమలు జరుపబడుతుంది.

అరగాణి ఉండే ప్రాంతాలనుండే ఈ ప్రాంతాలు ఎంపిక చేయబడతాయి. 1955_56 లో ఈపథకం ప్రారంభించబడింది. 1956_59 సంవత్సరాల కాలంలో 4,453 ఎకరాల్లో సొలోపు గట్లు వేయబడినాయి. ఈ పనులవల్ల లాభం పొందే వారి నుండి తగినట్టి ఒప్పందం కుదుర్చుకున్న తరువాతనే వ్యవసాయదార్ల పొలాల్లో ఈ పనులు నిర్వహించబడతాయి. తెలంగాణా ప్రాంతంలో 6,900 ఎకరాల భూమిలో సొలోపుగట్లు వేయడానికి, అవసరమయిన అదనపు సిబ్బందిని నియమించడానికి, ప్రస్తుతమున్న సిబ్బందిని కొనసాగించడానికిగాను 1959_60 ప్రణాళికలో రు. 6.06 లక్షల మొత్తం కేటాయించబడింది.

# మత్స్య సంవర్ధన

## ఎంపిక చేయబడిన చెరువులలో చేపలను అధికంగా ఉత్పత్తి చేయటం

ఈపథకం క్రింద, 5 మండలాలుగా ఏర్పాటు చేయబడే ఎంపిక చేయబడిన చెరువులలో చేపల ఉత్పత్తిని పెంచటానికి ప్రతిపాదింపబడింది. నిజామాబాదు, మెదక్, వరంగల్లు, కరీంనగరు, మహబూబునగరు జిల్లాలలో యీ 5 మండలాలు ఏర్పాటు చేయబడతాయి. ఒక్కొక్క మండలంలో 12 చెరువులుంటాయి. శాస్త్రీయ పద్ధతుల్లో చేపలను పెంచే విధానాన్ని అవలంబించటానికి, వాడకందార్లకు అమ్మకం చేయటంకోసం చేపలను ఉత్పత్తి చేయటానికిగాను ప్రత్యేక సిబ్బంది నియమించబడింది. ఈ సిబ్బందిని యీ సంవత్సరంలో కొనసాగించటంకోసం రు. 0.49 లక్ష మొత్తం (జిల్లాకు రు. 0.098 లక్ష చొప్పున 5 జిల్లాలకు) కేటాయించబడింది. ఈపథకం అమలు జరపటంవల్ల ప్రతి జిల్లాలోను అదనంగా 20,000 పౌన్ల చేపలను ఉత్పత్తి చేయటం జరుగుతుందని ఆశించబడింది.

## బెస్తల సహకార సంఘాలకు సహాయం

బెస్తలలో చాలమంది పేదవారు. తెలంగాణాప్రాంతములోని బెస్తల సహకార సంఘాలకు తగ్గింపు ధరలకు నైలాను వలలను సమకూర్చడమే ఈపథకం

యొక్క ఆశయం. 40 వలలనుకొని, సక్రమముగా నిర్వహింపబడుతున్న బెస్తల సహకార సంఘాలకు పంపకంచేసే నిమిత్తం 1959–60 సం. లో రూ. 0.10 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో 4 వలలు ఈ జిల్లాలో పంపకం చేయ బడతాయి. ఈ వలల ఖరీదు బెస్తలనుండి 5 సంవత్సరాల కాలంలో, చేపలు పట్టని నెలలను మినహాయించి, తేలిక వాయిదాలలో వసూలుచేయబడుతుంది.

---

# సహకారోద్యమం, గిడ్డంగులు, మార్కెట్లు

## గ్రామీణ పరపతి సంఘాల విస్తరణ.

ఆంధ్ర ప్రాంతంలో అమలులో ఉన్నపథకం పద్ధతిమీదనే ఈ పథకంకూడ రూపొందించబడింది. తెలంగాణాప్రాంతంలో ఉన్న గ్రామీణ పరపతి సంఘాలను పునర్వ్యవస్థీకరించటం, పటిష్ఠం చేయటం, విస్తరింపచేయటమే ఈ పథకంయొక్క ఉద్దేశం. సహకారశాఖ సిబ్బందిని పటిష్ఠం చేయటంద్వారాను, సెంట్రల్ బ్యాంకులు, పెద్దతరహా సంఘాలు అదనంగా నియమించే పర్యవేక్షక, నిర్వాహక సిబ్బందికి అయ్యే ఖర్చు క్రింద సహాయం చేయటం ద్వారాను ఈ పథకం రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో అమలుజరుపపడింది. 1959–60 సంవత్సరంలో ఇంతకుముందు నియమించ బడిన సిబ్బందిని కొనసాగించటానికి, తెలంగాణా ప్రాంతంలో క్రొత్తగా 650 చిన్న తరహా సంఘాలను ఏర్పాటు చేయటానికి ప్రస్తుతమున్న 500 చిన్న తరహా సంఘాలను పటిష్ఠం చేయటానికి, నిర్వాహక సిబ్బంది ఖర్చు క్రింద ధన సహాయం చేయటానికి ప్రతిపాదింప బడింది. రు. 300 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాల పరిమితిని రు. 30 లక్షల వరకు మధ్యకాలిక ఋణాల పరిమితిని పెంచటానికి కూడ ప్రతిపాదింప బడింది. అపెక్సు బ్యాంకులు, కేంద్ర సహకార బ్యాంకులు అప్పు తీసికొనే స్తోమతను ఎక్కువ చేసుకోవటానికి, తద్వారా అవి అప్పులిచ్చే సౌకర్యాన్ని అధికం చేసుకోవటానికి వీలు కలిగించే నిమిత్తం వాటి వాటా మూలధనాల క్రింద ఇంకా ఎక్కువగా ప్రభుత్వం డబ్బును ఇవ్వడానికి ప్రతిపాదింప బడింది. ఇప్పుడున్న జిల్లాకార్యాలయాలన్నీ రెండు డిప్యూటీ రిజిష్ట్రార్ల సర్కిళ్లుగా పునర్వ్యవస్థీక

రించబడతాయి. డిప్యూటీ రిజిష్ట్రార్లకు సహాయపడే నిమిత్తం సహకార సబ్ రిజిష్ట్రార్లు, సీనియరు, జూనియరు ఇనస్పెక్టర్లతో కూడిన అదనపు సిబ్బంది నియమించ బడుతుంది. కార్యనిర్వాహక శాఖనుండి ఆడిటు శాఖను విడతీసే పథకం కూడా యీ సంవత్సరంలోనే అమలు జరుప బడుతుంది.

ఈ కార్యక్రమం క్రింద ఈ జిల్లాలో కొత్తగా 200 చిన్న తరహా సంఘాలు ఏర్పాటు చేయబడతాయి. ప్రస్తుతమున్న 55 చిన్న తరహా సంఘాలు పటిష్ఠం చేయబడతాయి. పాత సంఘాల్లో 23,700 మంది సభ్యులు, క్రొత్త సంఘాల్లో 6,000 మంది సభ్యులు చేర్చుకోబడతారు. రు. 35 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలు, రు. 8 లక్షల వరకు మధ్యకాలిక ఋణాలు ఇవ్వబడతాయి.

పై కార్యక్రమం అమలు జరపటం కోసం ఈ జిల్లాకు రు. 1,66,480 లు కేటాయించ బడినాయి. ఆ డబ్బు క్రిందివిధంగా వినియోగించ బడుతుంది.

| | | రూపాయలు. |
|---|---|---|
| 1) | చిన్నతరహా సంఘాలకు సబ్సిడీ | |
| | (ఏ) 1958–59 లో ప్రారంభించ బడిన సంఘాలకు. | 3,300 |
| | (బి) 1959–60 లో ఏర్పాటు చేయబడ బోయే క్రొత్త సంఘాలకు... | 6,700 |
| 2) | పెద్ద తరహా సంఘాలకు సహాయం. | 7,900 |
| 3) | సెంట్రలు బ్యాంకులకు సహాయం. | |
| | (ఎ) సెక్రటరీగా నియమించ బడిన కో-ఆపరేటివ్ సబ్- రిజిష్ట్రారు జీతభత్యాలకు. . | 3,300 |
| | (బి) ఎక్జిక్యూటివ్ ఆఫీసరుగా పనిచేయుటకు నియమించ బడిన సీనియరు ఇనస్పెక్టరు జీత భత్యాలకు. | 1,500 |

| | | |
|---|---|---|
| (సి) | గత సంవత్సరాల్లో నియమించబడిన సూపరువైజరుల జీతభత్యాలకు... | 5,000 |
| (డి) | ఈ సంవత్సరంలో నియమించ బడే సూపర్‌వైజరుల జీతభత్యాలకు. | 6,400 |
| (ఇ) | అకౌంటెంటు, లోయరు డివిజను గుమాస్తా, మొదలైన సిబ్బంది జీత భత్యాలకు | 2,800 |

అదనపు సిబ్బంది జీత భత్యాలకు —

| | | |
|---|---|---|
| (ఏ) | 1957–58లో అదనంగా నియమించ బడిన సేల్ ఆఫీసర్లకు.... | — |
| (బి) | 1957–58లో అదనంగా నియమించ బడిన ఆడిట్ సిబ్బందికి .... | 21,000 |
| (సి) | సహకార సబ్ రిజిష్ట్రారు, టైపిస్టు, జవానుకు | 5,200 |
| (డి) | 1958-59 లో అదనంగా నియమించ బడిన ఆడిటు సిబ్బందికి. | 22,000 |
| (ఇ) | రెండు కో-ఆపరేటివ్ సర్కిళ్లగా జిల్లాలను విభాగించడానికి. | 24,550 |
| (ఎఫ్) | అదనపు తాలూకా ఇనస్పెక్టర్లకు. | 14,980 |
| (జి) | సర్కిలుకు ముగ్గురు సహకార సబ్ రిజిష్ట్రార్లు. ఇద్దరు సీనియర్ ఇనస్పెక్టర్లు, ఇద్దరు జూనియరు ఇనస్పెక్టర్ల చొప్పున అన్ని సర్కిళ్లకు అదనపు సిబ్బందికి. | 36,450 |

| | |
|---|---|
| (హెచ్) 1959-60 లో క్రొత్తగా ఏర్పాటు చేయబడబోయే ప్రతి సర్కిలుకు సహకార సబ్ రిజిష్ట్రార్లు, ఇన్స్పెక్టర్లు, మొదలగు వారికి. | 5,400 |
| మొత్తం. | 1,66,480 |

## భూమి తనఖా బ్యాంకుల అభివృద్ధి

ఈ పథకం క్రింద తెలంగాణా ప్రాంతంలో క్రొత్తగా ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులను ఏర్పాటు చేయటానికి, దీర్ఘ కాలిక ఋణాలు అధికంగా ఇవ్వటానికి తలపెట్టబడింది. 1957-58 లోను, 1958-59 లోను ఈ పథకం అమలు జరుపబడింది. క్రొత్తగా 14 ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులు ఏర్పాటు చేయబడినాయి. రు. 19.32 లక్షల వరకు దీర్ఘ కాలిక ఋణాలు ఇవ్వబడినాయి. ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులను ఏర్పాటుచేయటం, పర్యవేక్షించటం, తనఖీచేయటం నిమిత్తం సహకార సబ్ రిజిష్ట్రార్లు, సీనియరు ఇనస్పెక్టర్లు, సూపరువైజరులతో కూడిన అదనపు సిబ్బంది కూడ నియమించబడింది.

ఈ సంవత్సరంలో ఈ జిల్లాలో రు. 5.25 లక్షలవరకు దీర్ఘ కాలిక ఋణాలు ఇవ్వబడతాయి. ఒక భూమి తనఖా బ్యాంకు ఏర్పాటుచేయబడుతుంది ఈ సంవత్సరంలో రు. 0.136 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. అది క్రింది విధంగా వినియోగించ బడుతుంది.

రూపాయలు, లక్షలలో

1. నిర్వాహక సిబ్బందికింద ఖర్చు.

| | |
|---|---|
| (ఏ) గత సంవత్సరాల్లో ఏర్పాటుచేయబడిన పాత బ్యాంకులకు | 0.050 |
| (బి) ఈ సంవత్సరంలో ఏర్పాటుచేయ బడబోయే క్రొత్త బ్యాంకులకు | 0.030 |

| | | |
|---|---|---|
| 2. | చిల్లర ఖర్చులకింద బ్యాంకులకు సబ్సిడీ. | 0.013 |
| 3. | భూమి తనఖా బ్యాంకుల పని కోసం నియమించబడే సహకార సబ్ రిజిస్ట్రార్లు, జవానుల క్రింద ఖర్చు. | |
| | (ఏ) గత సంవత్సరాల్లో నియమించబడిన పాత సిబ్బంది క్రింద. | 0.043 |
| | (బి) 1959-60 లో నియమించబడే క్రొత్త సిబ్బందిక్రింద. | — |
| | మొత్తం. | 0.136 |

## సహకార మార్కెటింగు అభివృద్ధి

వ్యవసాయదార్లకు స్టోరేజి, గిడ్డంగి, ప్రాసెసింగు. మార్కెటింగు సౌకర్యాలను కలిగించటం ద్వారా సహకార మార్కెటింగును అభివృద్ధిచేయడం ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది. రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలకాలంలోను ఇది అమలు జరుపబడింది. 39 మార్కెటింగు సంఘాలు ఏర్పాటు చేయబడినాయి. అంతేకాక గిడ్డంగులు మొదలయిన వాటిని నిర్మించడానికి ఆర్థికసహాయం కూడ చేయబడింది.

ఈ సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో మరో 10 సహకార మార్కెటింగు సంఘాలను ఏర్పాటుచేయడానికి. మార్కెటింగు సంఘాలవాటా మూలధనం క్రింద రు. 7 లక్షలను ఇవ్వడానికి ప్రతిపాదించబడింది. ఇంతేకాక గిడ్డంగుల నిర్మాణానికి ఆర్థికసహాయం కూడ చేయబడుతుంది. సహకార మార్కెటింగు విషయాలకు సంబంధించి సీనియరు ఇనస్పెక్టర్లకు శిక్షణ కూడ ఇవ్వబడుతుంది. ఈ సంవత్సరంలో క్రింది కార్యక్రమాలు ఈ జిలాలో అమలు జరుపబడతాయి.

1. క్రొత్తగా రెండు మార్కెటింగు సంఘాలు ఏర్పాటు చేయడం.

2. ఫలసాయంపై రు. 15.00 లక్షలవరకు ఋణాలు ఇవ్వడం.

3. క్రొత్తగా ఏర్పాటు చేయబడే మార్కెటింగు సంఘాలద్వారా రెండు గిడ్డంగుల నిర్మాణం.

4. క్రొత్తగా ఏర్పాటు చేయబడే పెద్దతరహా సంఘాలద్వారా మూడు గిడ్డంగుల నిర్మాణం.

పై కార్యక్రమాన్ని అమలుపరచటం కోసం ఈ జిల్లాకు రు. 2.006 లక్షల మొత్తం కేటాయించబడింది. అది క్రింది విధంగా వినియోగించ బడు తుంది.

(రూ. లక్షలలో)

| | | |
|---|---|---|
| 1. | మార్కెటింగు సంఘాలకు వాటా మూలధనంక్రింద. | 1.000 |
| 2. | ఇదివరలో ఏర్పాటు చేయబడిన మార్కెటింగు సంఘాల నిర్వాహక సిబ్బందిక్రింద సబ్సిడీ. | 0.090 |
| 3. | ఈ సంవత్సరంలో ఏర్పాటు చేయబడే మార్కెటింగు సంఘాల నిర్వాహక సిబ్బంది క్రింద సబ్సిడీ. | 0.016 |
| 4. | పెద్దతరహా సంఘాలకు గిడ్డంగులు. | |
| | (ఏ) ఇదివరలో ప్రారంభించబడిన గిడ్డంగుల నిర్మాణం పూర్తిచేయడానికి. | — |
| | (బి) 1959-60లో నిర్మించే గిడ్డంగులకు. | 0.600 |
| 5. | మార్కెటింగు సంఘాలకు గిడ్డంగులు. | |
| | (ఏ) ఇదివరలో ప్రారంభించబడిన గిడ్డంగుల నిర్మాణం పూర్తిచేయటానికి... | — |
| | (బి) ఈ సంవత్సరంలో నిర్మించే గిడ్డంగులకు. | 0.300 |
| | మొత్తం. | 2.006 |

## పరిశోధన, పరిశీలన, గణాంక వివరాలు.

ఈ పథకంక్రింద సహకార శాఖలో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయబడుతుంది. సహకారశాఖద్వారా అమలు జర్పుపబడే వివిధ పథకాల మూలంగా ప్రజలకు కలిగిన ప్రయోజనాన్ని, ఆ పథకాలను అమలుజరపడంలో తెలియవచ్చిన అనుభవాన్ని పరిశీలించడానికి, సూత్ర విధానాలను రూపొందించడానికి, సహకార వ్యవస్థలో లోటుపాట్లు ఏవన్నా ఉంటే వాటిని సరిదిద్దుకొనేటందుకు మార్గాలను సూచించడానికి ఈ విభాగం కృషి చేస్తుంది. 1957-58 లో 20 మంది సీనియరు ఇనస్పెక్టర్లను జిల్లాలలో నియమించడంద్వారాను, గణాంక వివరాల సేకరణ, సంకలనం చేయటంకోసం ప్రధాన కార్యాలయంలో ఒక విభాగం ఏర్పాటుచేయడంద్వారాను ఈ పథకం అమలుజరుప బడింది. 1958-59 లో ఇది కొనసాగించబడింది.

1959-60 సంవత్సరంలో డిప్యూటీ రిజిస్ట్రారు గ్రేడులో ఒక స్టాటిష్టియను, ఇద్దరు సీనియరు ఇనస్పెక్టర్లు, ఇద్దరు జూనియరు ఇనస్పెక్టర్లు, ఇద్దరు జవానులతోకూడిన సిబ్బందిని జిల్లాల్లోఉన్న సిబ్బందికి సూచన లివ్వటానికి నియంత్రణ చేయడానికిగాను రిజిస్ట్రారు కార్యాలయంలో నియమించేటందుకు, క్రొత్త సర్కిళ్ళకు 12 మంది సీనియరు ఇనస్పెక్టర్లను, ప్రతి సర్కిలు ఆఫీసుకు ఒక్కొక్కరు చొప్పున 46 మంది లోయరు డివిజను గుమస్తాలను నియమించేటందుకు ప్రతిపాదింపబడింది. క్రొత్త విధానాలను రూపొందించి వాటిని అమలు పరచడానికి పద్ధతులను రూపొందించడానికిగాను సహకార శాఖలో పరిశోధన, పరిశీలన, ప్రచార విభాగం ఒకటి ఏర్పాటు చేయబడుతుంది. మొట్టమొదటగా ముగ్గురు సహకార సబ్-రిజిస్ట్రార్లు, ముగ్గురు జవానులతోకూడిన సిబ్బంది ఈ విభాగంలో నియమించబడుతుంది. పై కార్యక్రమాన్ని అమలు పరచటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.70 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.34 లక్ష మొత్తం ప్రధాన కార్యాలయంలో నియమించబడే సిబ్బంది ఖర్చుక్రింద, ప్రచారం మొదలయినవాటి కయ్యే ఖర్చు క్రింద ప్రత్యేకించబడింది. మిగిలిన రు. 1.36 లక్షలలో రు. 6,044 లు ఈ జిల్లాలో నియమించబడే సిబ్బంది ఖర్చుక్రింద కేటాయించబడినాయి.

## సహకార సంఘాల సభ్యులకు, పంచాయతీదార్లకు శిక్షణ

అఖిలభారత సహకార యూనియన్ద్వారా భారత ప్రభుత్వంవారిచే ప్రతిపాదింపబడిన పథకం నమూన్నాలో ఈ పథకం రూపొందించబడింది. ఈ పథకంక్రింద సహకార సిద్ధాంతంయొక్క మూల సూత్రిలనుగురించి, ఆచరణను గురించి, లెక్కలను తయారుచేయటం గురించి, సహకార సంస్థల నిర్వహణగురించి గ్రామీణ పరపతి సంఘాల సభ్యులకు రెండు, మూడు రోజులపాటు, పంచాయతీ దారులకు ఒక వారం రోజులపాటు, సహకార సంఘాలలో జీతంతో పనిచేసేవారికి 5 లేక 6 వారాలపాటు శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ జిల్లాలో 1,000 మంది సభ్యులకు, 300 మంది పంచాయతీదారులకు, 40 మంది కార్యాలయోద్యోగులకు శిక్షణ ఇవ్వటంకోసం 1959-60 లో రు. 7,246 లు కేటాయించబడినాయి.

## సహకార వ్యవసాయం

సహకార వ్యవసాయ సంఘాలను ఏర్పాటు చేయటంద్వారాను, వాటా మూలధనంక్రింద, ఎద్దులు కొనుక్కోవటానికి, భూమిని సాగులోనికి తెచ్చి అభివృద్ధిచేయటానికి, వ్యవసాయ పరికరాలు మొదలయినవాటిని కొనుక్కోవటానికిగాను ఋణాల రూపంలోను, గ్రాంట్ల రూపంలోను, ధనసహాయం చేయటంద్వారాను భూముల్లేని వ్యవసాయ కూలీలకు భూములలో పునరావాసం కల్పించటానికి ఈ పథకంక్రింద ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.22 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.34 లక్షలు ఆంధ్ర ప్రణాళికక్రింద, రు. 0.88 లక్ష తెలంగాణా ప్రణాళికక్రింద కేటాయించబడ్డాయి. సహకార వ్యవసాయానికి సంబంధించిన పనిని నిర్వహించటానికై ప్రధాన కార్యాలయంలో నియమించబడిన సిబ్బంది జీతభత్యాలక్రింద పై మొత్తంలో రు. 0.28 లక్ష ప్రత్యేకించబడింది, మిగత మొత్తంలో రు. 9,500 లు ఈ జిల్లాకు కేటాయించబడినాయి. ఇందులో రు. 3000/-లు యింతకుముందు ఏర్పాటు చేయబడిన సంఘాల సిబ్బందిక్రింద అయ్యే ఖర్చుకు. రు 6,500 లు జిల్లాలో ఈ సంవత్సరంలో ఏర్పాటు చేయబడబోయే సంఘాలకు ఆర్థిక సహాయం చేయటానికి వినియోగించ

బడుతాయి. ఈ జిల్లాలో ఒక క్రొత్తసంఘం ఈ సంవత్సరంలో 50 మంది సభ్యులతో ఏర్పాటు చేయబడుతుంది. 250 ఎకరాల భూమి సాగుచేయ బడు తుంది.

## రాజ్య గిడ్డంగి సంస్థ

దేశంలో గిడ్డంగుల నిర్మాణావశ్యకతను గురించి పెక్కు కమిటీలు, కమిషన్లు అనేకసార్లు నొక్కి చెప్పాయి. అవి పరపతి సంఘాలకు, పరపతేతర సంఘాలకు మధ్య చక్కని సారథ్యం వహిస్తాయి. ఈ విషయం దృష్ట్యా భారత ప్రభుత్వంవారు వేరుహౌసింగు కార్పొరేషను (గిడ్డంగి సంస్థ) ను ఏర్పాటు చేశారు. దీని కనుగుణంగా తమతమ రాజ్యాలలో రాజ్య గిడ్డంగి కార్పొరేషన్లు ఏర్పాటు చేయవలసిందిగా రాజ్య ప్రభుత్వాలు కోరబడినాయి, ఈ కార్పొరేషన్లు వేరు హౌసింగు బోర్డు ఆజమాయిషీక్రింద పనిచేస్తాయి. ఈ గిడ్డంగులు ఇచ్చే రసీదులు నెగోషియబుల్ ఇన్స్ట్రుమెంట్సుగా పరిగణించబడతాయి, ఈ గిడ్డంగు లలో వ్యవసాయోత్పత్తులను నిలువచేసుకొనే వారికి అవి ఇచ్చే రసీదులు ధరా వతుగా ఉంచుకొని బ్యాంకులు అప్పులను ఇస్తాయి. 1958-59 లో రాజ్య గిడ్డంగి సంస్థ ఒకటి ఈ రాజ్యంలో ఏర్పాటు చేయబడింది. ఈ సంస్థ వాటా మూలధనంక్రింద ప్రభుత్వంవారు రు. 2.50 లక్షల మొత్తం ఇచ్చారు. ఈ సంస్థకు వాటా మూలధనంక్రింద మరికొంత డబ్బు ఇచ్చేటందుకుగాను ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రణాళికలో రు. 5 లక్షలు, తెలంగాణా ప్రణా ళికలో రు. 5 లక్షలు కేటాయించబడినాయి. ఈ పథకంక్రింద ఈ జిల్లాలోని రైతులకుకూడ లాభం చేకూరుతుంది.

# జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు, సామాజికాభివృద్ధి కేంద్రాలు

1959 మార్చి అంతంనాటికి ఈ జిల్లాలో 5 మొదటిదశ బ్లాకులు, రెండు సామాజికాభివృద్ధి బ్లాకులు, రెండు ప్రీ - ఎక్స్టెన్షన్ బ్లాకులు ఉన్నాయి. వీటి

వైశాల్యం 1699.23 చదరపు మైళ్లు. ఈ కేంద్రాలలోని గ్రామాల సంఖ్య 547; ఇందు నివశించే జనాభా 6,34,116. భారత ప్రభుత్వం వారి నిర్ణయాను సారంగా 1959 ఏప్రిలు నెలనుండి ఏర్పాటు చేయబడబోయే ప్రతి బ్లాకులో కూడ ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమంక్రింద ఒక సంవత్సరంపాటు వ్యవసాయ విషయాలను గురించి తీవ్ర కృషి జరగాలి.

అదేప్రకారం 1-4-1958 తేదీనాడు మల్లియాల బ్లాకులోను, 2-10-1958 నాడు హసనాబాదు బ్లాకులోను ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమం ప్రారంభించబడింది. 1-4-1958 నాడు ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమం ప్రారంభించిన బ్లాకు 1-4-1959 నాడు, 2-10-1958 నాడు ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమం ప్రారంభించిన బ్లాకు 2-10-1959 నాడు మొదటిదశ బ్లాకులుగా రూపొందుతాయి. 1959-60 సంవత్సరంలో 36 ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకులు యీ జిల్లాకు కేటాయించబడినాయి. ఇందులో 18 బ్లాకులు 1-4-1959 నాడు మిగతవి 2-10-1959 నాడు ప్రారంభించ బడినాయి ఇందులో నిర్మల్, కొరట్ల బ్లాకులు యీ జిల్లాలో ఉన్నాయి. ఇవి వరుసగా 1-4-1959 తేదీనాడు, 2-10-1959 తేదీనాడు ప్రారంభించబడినాయి.

ఈ కారణంగా 1-4-1959 నాటికి ఈ జిల్లాలో 6 మొదటిదశ బ్లాకులు, రెండు సామాజికాభివృద్ధి బ్లాకులు, రెండు ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకులు ఉన్నాయి.

ఈ జిల్లాలో సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలు జరపటం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 6,68,600 లు ఋణాల పద్దు క్రింద, రు. 9,23,400 లు గ్రాంట్ల పద్దు క్రింద-మొత్తం రు. 15,92,000 లు కేటాయించ బడినాయి.

1-4-1959 వ తేది నాటికి ఈ జిల్లాలో ఉన్న సామాజికాభివృద్ధి బ్లాకులను చూపే పటం ప్రక్క పుటలో ఇవ్వబడింది.

## పంచాయతీలను పటిష్టం చేయుటం

### సిబ్బందికి సంబంధించిన పథకం

పంచాయతీలను పటిష్టంచేసే ఉద్దేశంతో జిల్లా స్థాయిలో జిల్లా పంచాయతీ ఆఫీసరును, రెవిన్యూడివిజను స్థాయిలో డివిజనలు పంచాయతీ ఆఫీసరును, తాలూకా

స్థాయిలో (బ్లాకు ప్రాంతాలను మినహాయించి) డిప్యూటీ పంచాయతీ ఆఫీసరును, బ్లాకు స్థాయిలో పంచాయతీలకు ఎక్స్టెన్షన్ ఆఫీసర్లను నియమించటం ద్వారా 1958-59 సంవత్సరంలో పంచాయతీల నిర్వహణకు సంబంధించిన పరిపాలనా యంత్రాంగం పునర్వ్యవస్థీకరించ బడింది. 1959-60 లో ఈ పథకం క్రింద రు. 8.00 లక్షల మొత్తం కేటాయించ బడింది ఇందులో రు. 0.120 లక్ష మొత్తం ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషను కార్యాలయంలో నియమించ బడిన సిబ్బందిని కొనసాగించేటందుకు, రు. 0.191 లక్ష మొత్తం పశ్చిమ, తూర్పు ఇనస్పెక్టింగ్ ఆఫీసర్ల కార్యాలయాల్లో నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించే టందుకుగాను ప్రత్యేకించ బడింది. అధికవ్యయం అయ్యే జిల్లాలకు పంపకంచేసే నిమిత్తం రు. 0.524 లక్ష మొత్తం ఇనస్పెక్టరు జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్ ఆధీనంలో ఉంచబడింది. మిగిలిన రు. 7.165 లక్షల మొత్తంలో రు. 0.4470 లక్ష 1958-59 లో ఈ జిల్లాలో నియమించ బడిన అదనపు సిబ్బంది కొనసాగింపు నిమిత్తం ప్రత్యేకించ బడింది.

### శిక్షణకు సంబంధించిన పథకం

ఈ పథకం క్రింద సామర్లకోట, రాజేంద్రనగరులలోని ఎక్స్టెన్షన్ శిక్షణ కేంద్రాలలో పంచాయతీలకుగాను నియమించ బడిన డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లకు పరిపాలన నిర్వహణ విషయంలో శిక్షణ ఇచ్చేటందుకు ప్రతిపాదింప బడింది. ఈ శిక్షణ రెండు మాసాలు ఇవ్వబడుతుంది. తడవకు 40 మంది ఆఫీసర్లకు శిక్షణ ఇవ్వబడుతుంది. మొత్తం 390 మంది పై వర్గాలకు చెందినట్టి ఆఫీసర్లకు శిక్షణ ఇవ్వబడుతుంది. ఇందుకుగాను ప్రణాళికలో 1959-60 సంవత్సరానికి రు. 2.90 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ జిల్లాలోని ఆఫీసర్లకు కూడా ఈ పథకం క్రింద శిక్షణ ఇవ్వబడుతుంది.

## పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు

పెద్ద తరహా, మధ్య తరహా నీటిపారుదల పనుల నిర్వహణ కోసం ఈ జిల్లాకు రు. 0.50 లక్షల మొత్తం 1959-60 సంవత్సరానికి కేటాయించ బడింది. వివరాలు క్రింద ఇవ్వబడినాయి.

| వరుస సంఖ్య. | ప్రాజెక్టు పేరు. | 1959-60 లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) | ఉద్దేశం | నీటిపారుదల జరిగే విస్తీర్ణం (ఎకరాలలో). |
|---|---|---|---|---|
| 1. | సలివాగు ప్రాజెక్టు | 0.50 | పని మొదలు పెట్టుటకు. | ... |

# విద్యుచ్ఛక్తి

## తెలంగాణా హైడ్రోథర్మల్ పథకం

(1) రామగుండం థర్మల్ పథకంక్రింద పనులు, (2) నిజాంసాగరు జల విద్యుచ్ఛక్తి పథకం క్రింద పనులు (3) సిటీ సర్కిల్ పునర్వ్యవస్థీకరణ—ఇవన్నీ యీ సమగ్ర పథకంక్రిందకు తేబడినాయి. తెలంగాణాకు సమగ్రమైన "గ్రిడ్" నొకదాన్ని ఏర్పాటు చేయటంకోసం అవసరమైన అదనపు ట్రాన్సుమిషను లైన్లను వేయటం, సబ్ స్టేషనులను నిర్మించటంకూడ యీ పథకం క్రింద జరుగుతుంది. యీ ప్రాంతంలో ఉన్న అన్ని జల విద్యుచ్ఛక్తి కేంద్రాలను కలిపి విద్యుచ్ఛక్తి వనరులను అభివృద్ధి చేయటమే యీ పథకంయొక్క ఉద్దేశ్యం. హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాల్లో రోజురోజుకు ఎక్కువవుతున్న విద్యుచ్ఛక్తి అవసరాలను తీర్చటంకోసం విద్యుచ్ఛక్తి సరఫరా ఏర్పాట్లను అభివృద్ధి చేయటంకూడ యీ పథకంక్రింద ఉద్దేశింపబడింది. ప్రణాళికలో 1959-60 సంవత్సరానికి యీ పథకంక్రింద రు. 100.59 లక్షల మొత్తం కేటాయించబడింది. అది క్రిందిపనులకుగాను వినియోగించబడుతుంది.

1. ఎల్లగడ్డ—విజయవాడ 132 కె. వి. లైను.
2. కరీంనగరు—సిద్దిపేట 66 కె. వి. లైను (రెండవ సర్క్యూటు)
3. దాదాపు 200 మైళ్ళ 33 కె. వి. గ్రిడ్ సబ్-ట్రాన్సుమిషను లైను
4. దాదాపు 500 మైళ్ళ 11 కె. వి. ట్రాన్సుమిషను లైన్లు.

5. హుస్సేనుసాగరు విద్యుచ్ఛక్తి కేంద్రంలో అదనపు బాయిలరును ఏర్పాటు చేయటంకోసం సివిల్ పనులను ప్రారంభించడానికి.

6. నగర విద్యుచ్ఛక్తి సరపరాకు అభివృద్ధి పనులు.

కేటాయించబడిన రు. 100.59 లక్షలలో యీ జిల్లా వాటా రు. 7.30 లక్షలు.

### గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

1959–60లో రు. 74.54 లక్షలవ్యయంతో తెలంగాణా ప్రాంతంలో 100 పట్టణాలకు, గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయుటకు ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 12.08 లక్షల మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. యీ మొత్తం 16 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడం జరుగుతుంది.

# గ్రామీణ పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు

## చిన్నతరహా పరిశ్రమలు

### కరీంనగరు జిల్లా పోడూరులో కట్లరీ పరిశ్రమ

ప్రజలకు ఉపయోగపడటానికి, వ్యాపార సరళిలో నిర్వహించటానికి ఉద్దేశించబడిన పథకం యిది. కట్లరీ పరిశ్రమలో ప్రస్తుతం పనిచేస్తున్న పనివారం దరినీ పోడూరులోఉన్న కార్ఖానాలో చేర్చి కట్లరీ పరిశ్రమాభివృద్ధికొరకు మేలురకం పరికరాలను, పనిముట్లను వివిధదశల్లో ఎలా వాడాలో వారికి తెలియపరచటమే యీ పథకంయొక్క లక్ష్యం. పనివారందరికీ అందుబాటులోఉండే ఉమ్మడి సౌకర్యాలను ఏర్పాటుచేయటం, తయారయిన వస్తువులకు "ఎలక్ట్రోప్లేటింగ్" చేయటంలో శిక్షణ యివ్వటంకూడ యీ పథకంక్రింద ఉద్దేశించబడింది. శాశ్వత భవనాలను నిర్మించటం, యంత్రాలను ఖరీదుచేయటం గత సంవత్సరమే పూర్తయింది.

ఈ సంవత్సరంలో యీ కేంద్రం పనిచేయటంకోసం రు. 0.28 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ కేంద్రంవల్ల రు. 20,000ల దాకా ఆదాయ ఉంటుందని ఆశించబడుతున్నది.

## కమ్మరిపని ప్రదర్శనకు సంచారయూనిట్టు ఏర్పాటు చేయటం

గ్రామాల్లో పనిచేస్తున్న కమ్మరి పనివారు తమ ఉత్పత్తి విధానాన్ని మెరుగుపరచు కొనేటందుకుగాను వారికి ఆధునిక యంత్రాలు మేలురకం పరికరాలు వాడటంగురించి ప్రదర్శన పూర్వకంగా తెలియచేయటంకోసం ఒక సంచారయూనిట్టును ఏర్పాటు చేయటానికి యీ పథకం ఉద్దేశించబడింది. కరీంనగరు జిల్లాలో ప్రస్తుతం యీ వ్యాను పనిచేస్తున్నది.

రు. 0.15 లక్ష వ్యయంతో ఈ సంవత్సరంలో యిది కొనసాగించబడుతుంది. ఈ సంవత్సరంలో యీ వ్యాను కరీంనగరు జిల్లా అంతటిలోను, వరంగల్లు జిల్లాలో కొంత భాగంలోను కార్యక్రమాన్ని జరిపిస్తుందని ఆశించబడుతున్నది.

## పది సహకార పరిశ్రమ కేంద్రాలను ఏర్పాటు చేయటం

సామాన్య సౌకర్యాలను పనివారలందరికీ అందుబాటులో ఉంచటంవల్ల వారు మేలురకం వస్తువులను పెద్దఎత్తున ఉత్పత్తి చేయటానికి వీలు చేకూరుతుంది. అట్టి సౌకర్యాలను కలిగించే నిమిత్తం తెలంగాణా ప్రాంతంలో పది సహకార పరిశ్రమ కేంద్రాలు 1957–58 లో ఏర్పాటు చేయబడినాయి. ఈ కేంద్రాలలో దాదాపు 200 మందికి పని కల్పించబడింది. ఈ పథకంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.24 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.048 లక్ష మొత్తం ఈ జిల్లాలో ఏర్పాటు చేయబడిన 2 కేంద్రాల కొనసాగింపు నిమిత్తం ప్రత్యేకించబడింది.

## పరిశ్రమలకు హైదరాబాదు ప్రభుత్వ సహాయ చట్టంక్రింద ఋణాలు

చిన్నతరహా పరిశ్రమలను అభివృద్ధి చేసేటందుకుగాను ప్రయివేటు రంగంలోని పారిశ్రామికులకు ప్రభుత్వ సహాయ చట్టం (స్టేటు ఎయిడుటు ఇండస్ట్రీస్ చట్టం) క్రింద ఋణాలు ఇవ్వటంకోసం రెండవ ప్రణాళికలో రు. 37.40 లక్షల మొత్తం కేటాయించబడింది. మొదటి మూడు సంవత్సరాల్లోను రు. 20 78 లక్షల మొత్తం ఋణాలుగా పంపకం చేయబడింది. ఈ సంవత్సరంలో రు. 7.00

లక్షలు ఈ పథకంక్రింద ఋణాలుగా ఇవ్వటం జరుగుతుంది. యీ పథకంవల్ల యీ జిల్లాలోని పారిశ్రామికులకు కూడ లాభం చేకూరుతుంది.

## పరిశ్రమల శాఖ డైరెక్టరు కార్యాలయాన్ని పటిష్ఠం చేయటం (జిల్లాల సిబ్బందికి మాత్రం చేయబడిన కేటాయింపు)

రెండవ పంచవర్ష ప్రణాళికలో పేర్కొనబడిన వివిధ పథకాలను జిల్లా స్థాయిలో సక్రమంగాను, సమర్థవంతంగాను అమలు జరిపేటందుకుగాను పరిశ్రమల శాఖను పటిష్ఠం చేసే ఉద్దేశంతో తెలంగాణా ప్రాంతం కోసం రెండవ ప్రణాళికలో రు. 6.10 లక్షల మొత్తం కేటాయించ బడింది. 1957-58,1958-59 సంవత్సరాలలో కొంత అదనపు సిబ్బంది జిల్లాలలో నియమించ బడింది. ఈ సిబ్బందిని కొనసాగించేటందుకు మరికొంత అదనపు సిబ్బందిని నియమించేటందుకు గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.25 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో కొంత డబ్బు యీ జిల్లాలో వినియోగించ బడుతుంది

## పరిశ్రమల శాఖ అసిస్టెంటు డైరెక్టర్లకు జీపుల సరఫరా

వివిధ పథకాలను సమర్థవంతముగా అమలు జరిపేటందుకు వీలు కల్పించే నిమిత్తం తెలంగాణా ప్రాంతంలోని తొమ్మిది జిల్లాలలోను పనిచేస్తున్న పరిశ్రమల శాఖ అసిస్టెంటు డైరక్టర్లు తొమ్మిది మందికి 1958—59 లో జీపులు సరఫరా చేయబడినాయి. ఈ జీపుల నిర్వహణ కోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.30 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఇందులో ఒక జీపు యీ జిల్లాలో ఉపయోగించ బడుతున్నది.

## బ్లాకు ప్రాంతాలలో నియమించ బడిన పరిశ్రమల విస్తరణాధికార్లకు జీతాలు

బ్లాకుప్రాంతాలలో నియమించ బడిన పరిశ్రమల విస్తరణాధికార్ల జీతాల క్రింద 1959—60 ప్రణాళికలో రు. 3.06 లక్షల మొత్తం కేటాయించ బడింది,

# హస్తకళలు

## కరీంనగరులో వెండి "ఫిలిగ్రి" పరిశ్రమ

కరీంనగరులో తారకాశన్ పారిశ్రామిక సహకార సంఘముయొక్క పర్యవేక్షక సిబ్బందిక్రింద అయ్యే ఖర్చుకోసం ఆర్థిక సహాయం యిచ్చుటకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.03 లక్ష కేటాయించబడింది.

## క్రొత్తపథకాలు

ఈ సంవత్సరంలో క్రింది క్రొత్త పథకాలు రాజ్యస్థాయిలో హస్తకళల విభాగంక్రింద అమలు పరచబడతాయి. ఇందువల్ల తెలంగాణాలోని అన్ని జిల్లాలకు లాభం చేకూరుతుంది.

| పథకం పేరు. | 1959-60 లో కేటాయింపు రూ. లక్షలలో |
|---|---|
| సహకార సంఘాల క్రిందకు తీసుకరావటానికి వీలులేకుండా ఉన్న పనివారికి గ్రాంట్లు, ఋణాలు ఇవ్వటానికి. | 0.10 |
| సంచార ప్రచార వ్యానుకు, దానికి కావలసిన సిబ్బందికి. | 0.20 |
| వస్తువుల నాణ్యతను ధృవీకరించడానికి. | 9.10 |

## నిర్మల్ బొమ్మల పరిశ్రమకు సంబంధించి ఉమ్మడి సౌకర్యాల కేంద్రం

నిర్మల్ బొమ్మల పరిశ్రమకు సంబంధించి ఉమ్మడి సౌకర్యాల కేంద్రాన్ని స్థాపించటంకోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0 10 లక్ష మొత్తం కేటాయించబడింది.

# పట్టు పరిశ్రమ

## వెంకటాపురంలోను, మహాదేవపురంలోను, టస్సరు విత్తనాల క్షేత్రాలను స్థాపించటం

వ్యాధిరహితమయిన టస్సరు విత్తనాల కాయలను ఉత్పత్తిచేసి, టస్సరు పరిశ్రమలో పనిచేస్తున్న కొండ తెగలవారికి సరఫరా చేయటంకోసం 1957-58లో వెంకటాపురంలోను, మహదేవపురంలోను రెండు టస్సరు విత్తనాల కేంద్రాలు ఏర్పాటు చేయబడినాయి. ప్రతి కేంద్రంలోను 12 మంది కొండ తెగల బాలురకు "రేరింగు", "రీలింగు" విషయాలలో ఉత్తమ పద్ధతుల్నిగురించి శిక్షణ యిచ్చేటందుకు పై కేంద్రాలలో సదుపాయాలున్నాయి. 1958-59లో ప్రతి కేంద్రంలోను "గ్రెయినేజు" భవనాలు నిర్మించబడినాయి. 12 మంది బాలురకు శిక్షణ యివ్వబడింది. ఈ సంవత్సరంలో రు. 0.61 లక్ష మొత్తం కేటాయించబడింది. పై మొత్తంలో రు. 0.31 లక్ష వెంకటాపురంలోని కేంద్రానికి ప్రత్యేకించబడింది. ప్రతి కేంద్రంలోను వ్యాధిరహితమయిన 10,000 టస్సరు విత్తనాల కాయలు ఉత్పత్తి చేయటం జరుగుతుందని, 12 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వటం జరుగుతుందని ఆశించబడుతున్నది.

## మానేరులోని ప్రభుత్వం సిల్కు-ఫారంను పటిష్ఠం చేయటం

మానేరులోని సిల్కు-ఫారంలో ప్రస్తుతమున్న సాంకేతిక సిబ్బందిని పటిష్ఠం చేయటం, అదనపు సౌకర్యాలను కూర్చటం యీ పథకంక్రింద ఉద్దేశింపబడింది. ఏటా 12 మందికి శిక్షణ యివ్వటానికికూడ ప్రతిపాదింపబడింది. వీరికి నెలకు రు. 20/-లు చొప్పున స్టయిఫండు చెల్లించబడుతుంది. 1957-58, 1958-59 సంవత్సరాల కాలంలో ఈ కేంద్రానికి సాంకేతిక పరికరాలను సమకూర్చటానికి, తోటకు నీటి పారుదల కల్పించటంకోసం ఒక ఇంజనును సమకూర్చటానికిగాను రు. 0.19 లక్ష మొత్తం ఖర్చుచేయబడింది. ఈ సంవత్సరంలో యీ క్షేత్రానికి యింకా అభివృద్ధిపనులు చేయటానికి, ప్రస్తుతమున్న భవనాలకు మరమ్మతులు చేయటానికిగాను రు. 0.30 లక్ష మొత్తం ప్రణాళికలో

ప్రత్యేకించబడింది. ఈ సంవత్సరంలో ప్రయివేటు వ్యవసాయదారులద్వారా నూరు ఎకరాల భూమిని మల్బరీ తోటలక్రిందకు తీసుకరావటానికి కూడ ప్రతిపాదింప బడింది.

## మానేరులో "మల్బరీ నర్సరీ" ఏర్పాటు చేయటం

1957-58లో మానేరులో ఒక "మల్బరీ నర్సరీ" ఏర్పాటు చేయబడింది. మేలురకం మల్బరి అంట్లు తయారుచేసి సరఫరా చేయటంకోసం యీ నర్సరీ ఏర్పాటు జరిగింది. స్థానిక విదేశీరకాల అంట్లు పెంచబడినాయి. ఈ సంవత్సరంలో యీ పథకం కొనసాగించబడుతుంది. 10,000 మల్బరీ అంట్లు పెంచబడతాయి. స్టోరు, అంట్లు నిలవచేసే పాక నిర్మించడానికి, యీ కేంద్రం కొనసాగింపుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.15 లక్ష మొత్తం కేటాయించబడింది.

# చేనేత పరిశ్రమ

## చేనేత పారిశ్రామిక సంఘాలకు వాటా మూలధనం, నిర్వహణ మూలధనంక్రింద ఋణాలు

చేనేత పారిశ్రామిక సంఘాలలో వాటాలు తీసికొని, వాటిలో సభ్యులుగా చేరటానికి వీలుగా నేతపని వారికి ఈ పథకంక్రింద ఋణాలు ఇవ్వబడతాయి. ఈ సంవత్సరపు తెలంగాణా ప్రణాళికలో ఈ పథకం క్రింద రు. 0.87 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.13 లక్ష వాటా మూలధనంగా ఋణాలు రూపంలో పంపకానికిగాను ఈ జిల్లాకు కేటాయించబడింది. ఈ జిల్లాలో ఈ సంవత్సరంలో దాదాపు 700 క్రొత్త మగ్గాలు సహకార వ్యవస్థ క్రిందకు రాబడతాయని ఆశించబడుతున్నది

## కేంద్ర సంఘంయొక్క మార్కెటింగు వ్యవస్థ విస్తరణ

నేత బట్టలను విరివిగా విక్రయించేటందుకు హైదరాబాదు చేనేత కార్మిక కేంద్ర సహకార సంఘంవారు, ప్రాథమిక చేనేత కార్మిక సంఘ్లాలవారు జిల్లాల్లో

అమ్మకం డిపోలను ఏర్పాటు చేస్తున్నారు. ప్రతి డిపోకు రు. 1,500 ల విలువ చేసే కుర్చీలు, బల్లలు మొదలయిన సామాను సరఫరా చేయబడుతున్నది. రెండవ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాల్లో 53 డిపోలు తెరువ బడినాయి. ఈ సంవత్సరంలో ఇంకా 12 డిపోలు తెరవడానికి, చేనేత బట్టలను గురించి తీవ్ర ప్రచారం జరిపించడానికి ప్రతిపాదించబడింది. ఇందుకు గాను ప్రణాళికలో రు. 1.54 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష మొత్తం ఈ జిల్లాలో రెండు డిపోలను తెరవటానికి ప్రత్యేకింపబడింది.

## సాంకేతిక అభివృద్ధి, మేలు రకం పరికరాలు

చేనేత పరిశ్రమలో సాంకేతిక నైపుణ్యాన్ని అభివృద్ధి చేసే ఉద్దేశంతో ఈ పథకం క్రింద చేనేత కార్మికులకు మేలు రకం పరికరాలు సరఫరా చేయ బడతాయి. ఇందుకు గాను ఈ సంవత్సరంలో రు. 1.91 లక్షల మొత్తం కేటా యించబడింది. ఇందులో రు. 0.23 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ మొత్తంతో 37 ప్రామాణికమైన రీడ్లు, 6 వార్పింగు యంత్రాలు, 33 స్లేలు, 2 ప్రెస్ యంత్రాలు సరఫరా చేయబడతాయి.

## ముదరా

చేనేత గుడ్డ అమ్మకాన్ని ప్రోత్సహించడం ద్వారా దాని ఉత్పత్తిని అధి కం చేసే ఉద్దేశంతో చేనేత గుడ్డ అమ్మకంపై ముదరా ఇవ్వబడుతున్నది. సాధారణంగా రూపాయకు ఆరు నయాపైసల చొప్పున ముదరా ఇవ్వబడుతున్నది. అయితే సంఘాల్లో సరకు నిలువ ఉండి పోయినపుడు మాత్రం దాన్ని అమ్మి వేయటం కోసం అప్పుడప్పుడు అదనపు ముదరా కూడ ఇవ్వడానికి అనుమతించ బడుతున్నది. ఈ పథకం క్రింద ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 35.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.25 లక్షల మొత్తం ఈ జిల్లాలో ముదరా ఇవ్వటం కోసం ప్రత్యేకించబడింది.

## ఉన్ని పరిశ్రమ (కంబళ్ళ పరిశ్రమ)

తెలంగాణా ప్రాంతంలో ఉన్ని పరిశ్రమ అభివృద్ధి కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.58 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ. 0 48 లక్ష మొత్తం క్రింది పనుల నిమిత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది.

(ఏ) 113 క్రొత్త మగ్గాలను చేర్చుకొనడానికి

(బి) ఉన్ని నేత పనివారికి క్రింది మేలు రకం పరికరాలను సరఫరా చేయడానికి

| | | |
|---|---|---|
| (1) | ఫ్లయి షటిల్ మగ్గాలు | 20 |
| (2) | హీల్డులు | 20,000 |
| (3) | రీడ్లు | 80 |
| (4) | ఉన్ని కార్డింగు యంత్రాలు | 3 |

# రోడ్లు

## బకాయి పనులు

తెలంగాణాలో ప్రథమ పంచవర్షప్రణాళికా కాలంలో పూర్తి చేయబడకుండా మిగిలిన బకాయి రోడ్డు పనులను కొనసాగించే నిమిత్తం 1959-60 ప్రణాళికలో రు. 3 09 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.576 లక్ష మొత్తం క్రింది పనుల నిమిత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. పార్కాల్ మాధవపూరు రోడ్డు నిర్మించటం కోసం యీ డబ్బు వినియోగించబడుతుంది.

## క్రొత్త రోడ్డు పనులు

తెలంగాణా ప్రాంతంలో క్రొత్త రోడ్డు పనుల నిర్వహణ నిమిత్తం 1959-60 లో ఈ పథకం క్రింద రు. 37.69 లక్షల మొత్తం కేటాయించబడింది.

ఇందులో రు. 2.98 లక్షల మొత్తం ఈ జిల్లాకు క్రింది పనుల నిమిత్తం ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1959-60లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | వెంకటాపురం నుండి మహదేవపురానికి రోడ్డు నిర్మించటం. | 0.63 |
| 2. | జగిత్యాల నుండి ధర్మపురికి రోడ్డు నిర్మించటం | 1.50 |
| 3. | సిద్ధిపేట-హసనాబాదు రోడ్డు భాగం నిర్మించటం | 0.25 |
| 4. | వెంకటాపురం - మహదేవపురం రోడ్డు మీద మానేరునదిపై హైలెవల్ "కాజ్ వే" నిర్మించటం | 0.60 |

## దుమ్ము రేగని రోడ్ల నిర్మాణం

తెలంగాణా ప్రాంతంలో దుమ్మురేగని రోడ్డు పనుల నిర్వహణ నిమిత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 20 00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.50 లక్ష మొత్తం క్రింది పనుల నిమిత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

| వరుస సంఖ్య. | పని వివరం | 1959-60 లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | హైదరాబాదు - చాందా రోడ్డు (భాగం) మైలు 78 నుండి 97 వరకు | 0 50 |

## పర్యటనత్వాభివృద్ధి

తెలంగాణాలో పర్యటనత్వాభివృద్ధి కార్యక్రమాలకుగాను 1959-60 ప్రణాళికలో రు. 2.04 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.25 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది. ధర్మపురిలో తక్కువ ఆదాయం వచ్చే వర్గం వారికి గాను ఒక విశ్రాంతి గృహం పై డబ్బుతో నిర్మించబడుతుంది.

